ములు జీవేశ్వరులు అసత్ప్రతిపాదకము జడజగత్తు వీటికన్నిటికి విలక్షణమైనది పరబ్రహ్మముగావున అది సత్తుగాదు, అసత్తుగాదు, సదసత్తుగాదు అది సదసత్తుగా నున్నదనిన ప్రపంచమేయగును. సత్తనిన జీవేశులు ఆత్మయనియు అసత్తనిన జడము అనాత్మయనియు చెప్పవలయును. ప్రపంచధర్మములగు పంచవిధభేదములు ఆత్మకుచెప్పవలసి యుండును. ఈశ్వరుడొక్కడే జీవులు పలువిధములుగానున్నవి వాటి భేదములు 1 జీవేశ్వరభేదము, 2 జీవజీవ పరస్పరభేదము, 3 జీవజడములభేదము, 4 జడజడములభేదము, 5 ఈశజడములభేదము. ఈ పంచవిధభేదములు పరమాత్మయందుకలవు ఆత్మ భేదరూపము అను ఈలాంటి దోషములు సంభవించును. భేదాభేదములకతీతమగు కేవల బ్రహ్మత్వమునకు విరుద్ధమగును కావున పరమాత్మ సదసద్విలక్షణము. ఇందు చేతనే ఆత్మా సదసత్తులకును, చేతనాచేతనములకును, ధర్మాధర్మములకును, సత్యాసత్యములకును, కార్యకారణములకును చిదచిత్తులకును, లాభలాభములకును, యోగక్షేమములకును, అతీతమైనది సకలద్వంద్వవ్యవహార రహితమైనది ధర్మాధర్మములు సత్యాసత్యములు మొదలగునవి సర్వద్వంద్వములు బుద్ధికిలోబడినవి (ఆత్మబుద్ధ్యతీతమైనది పరమాత్మ అఖండపరిపూర్ణ ద్వయానంద సమరసమైనది సర్వదాఅచంచలము సకలాతీతము నిస్త్రైగుణ్యోభవార్జున త్రిగుణములు వేదములు బుద్ధికి గోచరించునవి, తదతీతములుగావు కావున త్రిగుణాతీతుడవుకమ్ము "నిర్యోగక్షేమ ఆత్మవాన్ నిర్ద్వంద్వః నసత్తన్నాసదుచ్యతే" అనిభగవద్గీత "పరప్రకృతిః చేతనశ్చేతనానాం" శా॥ చేతనులగు బ్రహ్మాదులకును చేతనుడను ' ఈ ప్రకారము వేదోపనిషత్తులు స్మృతులు ఆత్మయొక్క సకలాతీతస్థితినే ధృఢము జేయుచున్నవి ఇదియే పరబ్రహ్మము అనిర్వచ్యము మనోవాచామగోచరమను సిద్ధాంతము" సదసత్త్వరమ్ 'సత్తు జీవునకు అసత్తగు దేహమునకు విలక్షణుడు పరమాత్మయని గీతచెప్పుచున్నది."

ఆ అంతరాత్మ తనలోనున్న యాత్మవస్తువు మనోబుద్ధ్యాదింద్రియములు దేహము ప్రకృతివశముచే క్షణక్షణము వికృతినిని జెందినవిగాగ వాటిని వానివికారములను తానుదెలియుచున్నదై నిర్వికారమై సాక్షియైయున్నది. క్షణక్షణము మార్పుజెందునవేవియో అవినవికారములు, తదితరము అవికారి కాబట్టి హృదయాంతర్గతమగు పరమాత్మయే నిత్యుడు అవికారియని జెప్పనర్హుడు. ఇది పరమాత్మస్వరూపము అనాత్మపదార్థములగు జగత్తు అనగా దృశ్యము అహంకా

రమను రెండేవిగలవో అవి నిత్యములుగావు. వీటియొక్క అభావము, సంకల్ప స్వప్న సుషుప్తి ఈమూడవస్థలయందును మాటిమాటికి స్పష్టముగాఁగాంచ బడెను. సుషుప్తియందు బుద్ధియేలేదు. కనుక అహంకారమనునదియే లేదు ఎవరికిని నేనను జ్ఞానము నిద్రావస్థయందు గలుగుటలేదు. ఇక జగత్తు అంతక ముందేలేదు. కనులుమూసిననే దృశ్యము దృశ్యమానమగుటలేదు. ఇట్లుండ సుషుప్త్యవస్థలో జగత్ప్రతీతి ఎవరికిని సంభవించుటలేదు స్వప్నావస్థయంద మనఃకల్పితమగు ప్రపంచముగాని, నేననుయహంకారముగాని, వాస్తవములు గావు జాగ్రదావస్థయందది యంతయు స్థిరముకాదనియు నిష్ప్రయోజనమనియు గంధర్వనగరమువంటిదని తాను తలంచుచున్నాడు జాగ్రదవస్థయందును నానా విధ సంకల్పములను జేయుచున్నాడు చిత్రవిచిత్ర ప్రపంచవ్యవహారములను గాంచుచునున్నాడు. నానావిధ యభిమానములను పెంచుచున్నాడు అవియ న్నియు సంకల్పమాత్రములగుటచే సిద్ధించినవిగావు మఱియు జాగ్రదవస్థ యందును ప్రపంచస్థితిని గాంచిన దానిస్థితి ఏకరూపముగ నుండుటలేదు ఎన్ని యోనశించుచున్నవి తిరుగాపుట్టుచున్నవి. ఇచ్చోట మనోరథ పథముచే జాగ్ర దవస్థయందు మనోరథము స్పష్టములుగానున్నవి. చతుర్థ శేంద్రియ వ్యవహార ములతోఁగూడుకొని యున్నది. స్వప్నమునందు వ్రసష్టముగాలేవు. అందుచే జాగ్రదవస్థ గ్రహింపనగును ఇంతకు ఫలితార్థమేమగాన త్రివిధావస్థలయందును జగదహంకారములు రెండును విచారదృష్టిచే లేకున్నవి. అవి ఎప్పుడును క్షణిక ములు వికారసహితములు సకలసాక్షియగు యంతరాత్మ యొక్కటియే నిర్వికార మైనది, నిత్యమైనదని మహాత్ములయొక్క అనుభవరూపము

కావున దేహము దానినధిష్టించియున్న అహంకారము యివి రెండును శాశ్వతములుకావు మోక్షప్రతిబంధకములు కాబట్టి మాంసపిండమగు తనువు నందును బుద్ధికల్పితమగు దానియొక్క యహంకారమందును, అభిమానమును మమత్వమును పరిత్యజింపవలయును

ఈప్రకారమహంకార, మమకారముల దిగనాడి త్రికాలముల యందుం న్నదియు అఖండబోధరూపమైనదియగు తనయథార్థ స్వరూపమును దెలిసి కొనిన వారే శాశ్వత పరమశాంతిని బొందుచున్నారు.

ఇచ్చోట, స్థూలశరీరాభిమానమును, సూక్ష్మశరీరమగు యహంకారాభి మానమును స్వయం ఆత్మ ప్రబోధముచే కారణ శరీరాభిమానమును వదలి

శాశ్వతమైన సుఖము బడయవలయును

"తమాత్మస్థం, యే౽ను పశ్యన్తి ధీరా, స్తేషాం శాంతి షామ్" తా॥ యేధీరులు తమయాత్మస్వరూపమును, గాంతురో శాంతిగలుగును ఇతరులకు లేదు అనిఉనిషత్తువాక్యము

దేహాభిమానమును గురించిన విషయమున "దేహో౽ల మహాపాపమితిస్ఫుటం దేహో౽హమితి యత్ జ్ఞానం తదేవ తా॥ దేహమే నేననెడి సంకల్పము మహాపాపము, నేను దేహ మహానరకము. ఇదిస్పష్టము.

ఉపనిషత్తు "కృషితో దుఃఖీమూఢో౽హం, హస్తపా ఇతిభావనరూపేణ, వ్యవహారేణ బధ్యతే." అనగా నేను కృ దుఃఖిని, మూఢుఁడను, హస్తపాదాదులు గలవాఁడను అను హారముచేత జీవుఁడు బద్ధుఁడగుచున్నాడు. "నా౽హందుఃఖీన ర్నాస్తినమేమృతిః యితి భావణరూపేణ వ్యవహారేణముచ్యతే' దుఃఖినిగాను, దేహముబుద్ధినిగాను, నాకుమరణములేదు. ఇందు కావున దేహాభిమానము వదలి పరమాత్మభావముతో నుండవలెం

ఈ శరీరము జీవించియున్నప్పుడును పీనుగేయగును. దే జడము మరణించినప్పుడు తనువు శవమగుచున్నది. కదలుట అలాగున జీవించియునప్పుడీకాయము అట్టిదియేయగును. జీవుడ చైతన్యపదార్థమైయున్నాడు. కనుకనే యోగశాస్త్ర తత్వజ్ఞులు శవాకారముగానే చేయవలయునని తెలుపురహస్యము.

ప్రాణవాయువు వున్నప్పుడు ఈశరీరము అర్థశవము అని మహాత్ములచే వ్యవహరింపబడుచున్నది. ఇట్టిశరీరము న బ్రాహ్మణాది జాతులు వసిష్ఠాది గోత్రములు రామకృష్ణాది నామ ములు బ్రహ్మచర్యాద్యాశ్రమములు వుంటున్నవి

ఈ దేహము కలిగినప్పుడే ఈదేహధర్మములు కల్పింపబ ఈ యధ్యాసజన్యములగు నామరూపాదులయందభిమానమును ఆటులనే లింగశరీర ధర్మములగు నహంకార మమకారములు త్య ఇవ్విధమగు సకల ప్రతిబంధములను విడనాడి అఖండానంద గావలయు. ఈ దేహమును గూర్చి ఉపనిషత్తులు చెప్పిన

"దేహో౽హమితియత్ జ్ఞానం తదేవాజ్ఞానముచ్యతే దేహో౽హమితియత్ జ్ఞానం తదసద్భావమేవచ" దేహో౽హమితి సంకల్పః। సత్యజీవస్సఏవహి। దేహో౽హమితియత్ జ్ఞానం పరిచ్ఛిన్నమితీరితమ్। అనగా దేహమేనేను నెనేదేహము అను భావనయేదిగలదో అదియే అజ్ఞానము, అసత్తు, అవిద్య, ద్వైతము, జీవుడు, పరిచ్ఛిన్నము, మోహము, అభిమానము నగుచున్నది. దేహేంద్రియాదులందలి యధ్యాసము మోక్షమునకు మహాప్రతిబంధకము ఇదియే మూలవిద్యకు కారణము. సూక్ష్మముగా విచారించిన యెడల నేననుజ్ఞానమునకువిషయమగు ఆత్మకును, ఇదియను జ్ఞానమునకును విషయమగు అనాత్మదృశ్యపదార్థమునకును విషయీకరించునది ఆత్మ విషయము గోచరమగునది అనాత్మపదార్థము ఈ హేతువుచేత తమఃప్రకాశములవలె పరస్పర విరుద్ధ ధర్మములుగల వగుటచేత, పరస్పరాభేదము సిద్ధించదనునది సిద్ధించగా అనగా(ఆత్మ అనాత్మ గాదు అనాత్మ ఆత్మగాదని భావము ) "ధర్మిణి సతి తద్ధర్మాః సిద్ధంతి" అను రీతిగా, ధర్మివాక్యము యుండగా, ధర్మములుంటున్నవి ధర్మికభేదము సిద్ధించిన ధర్మములకును అభేదము పొసగును కాబట్టి ఆత్మానాత్మ ధర్మములగు చైతన్య జాడ్యాదులకును అన్యోన్యాభావము సిద్ధించగదు

ఈ ప్రకారము ఆత్మానాత్మపదార్థములు పరస్పర విరుద్ధములగుటచే అన్యోన్యభేదము సిద్ధించనికారణమువలన అస్మత్ ప్రత్యయ విషయమైన సాక్షియైన చిదాత్మకాత్మయందు యుష్మత్‌ప్రత్యయగోచర దృశ్యజాతముయొక్క తద్ధర్మ జాడ్యాదులయొక్క అధ్యాసయు విషయమైన అనాత్మ పదార్థములగు అహంకారాదులయందు చైతన్యాత్మయొక్క తధర్మములగు ఆనందాదుల యొక్క అధ్యాసయు మిధ్యఆత్మయందు దేహాధ్యాసకల్పితము అజ్ఞానముచేతనే నేను నాదియను వ్యవహారముగలిగినది కావున దీనిని యూరీకరించి అఖండాత్మస్వరూపుడుగావలయును.

మోక్షమునుగోరు పురుషునకు సంసారకారణములగు ననేక ప్రతిబంధములుంటున్నవి. అవి యేవియన చిత్తవృత్తులు ఇవి అంతఃకరణమున యజ్ఞానబలముచే నవిశ్రాంతముగా కుప్పలు కుప్పలుగా నుద్భవించుచు పురుషుని వికారముగల వానినిగా జేయుచున్నవి వికారముజెందునవియు అపవర్గపథ ప్రతిబంధకములగు ఈ నానావిధ చిత్తవికారములలో మొదటి వికారము అహంకారము ఇది చిత్తవికారములన్నింటికిని పరమ మూలముగనున్నది. అనెక సం

కల్పవికల్ప సౌధములకు పునాదియే అహంకారము. అంతఃకరణమున నేనను వృత్తి పొడమెనేని దానివెంబడే నాదియను మమకారమున్ను ఏర్పడుచున్నది. కనుక సకలచిత్త వికారములకును అహంకారమే ప్రధానమగును మూలకారణ ముగను యగుచున్నది. కావున దీనిని మొదట త్యజించవలయు రాహుగ్రహ ముచే విడువబడిన చంద్రుడు నిర్మలముగా స్వయంప్రకాశమానుడగుచున్నాడు అలాగున అహంకారమను రాహుగ్రహముచే విముక్తుడగువాడు స్వయంజ్యోతి స్వరూపముగలవాడై పరిపూర్ణుడై నిత్యానందుడై స్వస్వరూపమను నిరావరణ స్థితిని పొందుచున్నాడు. అనగా రాహుగ్రహస్థమగు చంద్రుడు ఇతరప్రాణికోట్లకు ప్రకాశము నివ్వజాలడు. తానున్ను ప్రకాశింపజాలడు

అతీరుననే స్వయంప్రబోధములేని నిరావణ జ్ఞానరహితుడు తాను పరమాత్మస్థితిని పొందలేనప్పుడు ప్రతిబంధరహితుడెట్లుగాగలడు. కావున అహం కారమును త్యజించిన పరిపూర్ణచంద్రుడు రాహుగ్రహనిర్ముక్తుడై సకలకళలతో విరాజిల్లునటుల నిరావరణ పరిపూర్ణ విజ్ఞానకళలతో నొప్పుచున్నవాడై పరమ శాంతియను చంద్రికతో సకలతాపముల నడంచి స్వయంతేజోరూపుడగును స్వస్వరూపబ్రహ్మమగును.

శ్లో॥ అహంకారో మహగాహో యత్నేనతం నిక్రంతత।
తస్మిక్స్థితేనముక్తిస్స్యా చ్ఛాస్త్రయుక్తి శతైరపి॥

అనగా అహంకారమనునది యొకమొసలి వంటిది దానిని యత్నముతో చేదించవలె ఆయహంకారగ్రహమును విడువలేనప్పుడు శాస్త్రయుక్తులు యెన్నియుండినను ముక్తుడుకాజాలడు. కనుక యీయహకాంరమును సంపూర్ణముగా విడనాడుటకు శ్రద్ధవహించి తీవ్రతరప్రయత్నపరుడుగావలయు

ఈ శరీరమును పట్టణమందు వాడేనేనను యను ప్రత్యయమునకు ఎవడు విషయమగుచు సోఽహం శబ్దవాచ్యుడై సోఽహమని అజీవుడు స్వాంతఃకరిణ తదాత్మ్యముతో నేనని అహంకరించి ఽమోగుణప్రయుక్త అతిమూఢత్వ ముచే మిక్కిలిమలినబుద్ధిచేత నావరింపబడుచున్నాడు. అందుచే సకలనర్ధములకు లోనగుచున్నాడు. అట్టియహంకారాత్మక తమోగుణభూయిష్ట అతిమూఢబుద్ధి యొక్క యుపాధి పూర్తిగా తొలగినయెడల అజ్ఞాననాశ గలుగగా తాను అపర బ్రహ్మమేయగును అఖండవిజ్ఞానము తనకు ప్రతిబంధరహితమై భాసిల్లు చున్నది. అనగా జీవుడే పరబ్రహ్మమగుచున్నాడు.

గాన మిక్కిలి బలవత్తరమైన యహంకారమను మహాగొప్పసర్పవ సత్వరజస్తమో గుణములను మూడుశిరస్సులచే వ్యామోహమును విషజ్వాలఁ గ్రక్కుచు బ్రహ్మానందమను గొప్పనిధికి తనను చుట్టుచుట్టుకొని సంరక్షించు చున్నందున జితేంద్రియులు. విషయరక్తులు గాని వారలకు దుస్సాధ్యమై యున్నది కావున ఉపనిషత్ప్రతిపాదితమగు వేదనియమములవలంభించి శ్రద్ధ భక్తి ధ్యానములచే స్వానుభవ విజ్ఞాన మహాతీవ్ర ఖడ్గముచే సత్వరజస్తమో గుణములను మూడుతలలను మొదలంటు చేధించి ఆదురహంకార దుష్టసర్ప మును పూర్తిగానశింపజేసిన ధీరుడు అఖండానందకరమగు బ్రహ్మానందనిధిని అనుభవించుటకు సామర్థ్యముగల వాడగుచున్నాడు. కావున అనాత్మపదార్థముల యందలి తాదాత్మ్యభ్యాసచే గలిగిన మూలాహహాంరము సమూలముగా మడియ విదే శాశ్వతమగు ఆత్మసుఖము పొందనేరడు. సర్పములకు దంతములయందు విషముస్వభావముగానుండును. ఆదందము లూడఁబెరికిన విషము పూర్తిగా లేక పోవుచున్నది ఆలాగున అహంకార కాకోదరము యొక్క మలినవాసనావృత్తు లను దందములూడబెరికిన ప్రకృతి బంధమగు అజ్ఞానమను విషము స్వయ ముగా నశించుచున్నది. కనుకనే ప్రకృతిని జయించిన మహానుభావులు విష శైద్యునివలె ప్రపంచమున వర్తించుచుందురు. కాబట్టి అహంకారమను పెను భామును చంపివేయవలయు ననగా అహంకారము నశింపవలయునని శాస్త్ర ములు చెప్పురహస్యము.

ఈ అహంకారమొక విషదోషముతోఁగూడిన వస్తువువలె నున్నది. సర్పాదివిషదోషముగాని సన్నిపాతజ్వరాది దోషముగాని ఎంతవరకీదేహమున నున్నదో, అంతవరకు ఆరోగ్యమెటులగలుగును ఆలాగున అహంకారముండిన ధ్యానయోగికెప్పటికి ముక్తిలభింపజాలదు కావున విద్వాంసుడు అహంకార మును నిశ్శేషముగా నిశింపజేసినచో శరీరమందున్న విషదోషము పూర్తిగా వినాశమొందిన ఆరోగ్యసిద్ధి గలుగునటుల ధ్యానయోగికి పరమశాశ్వతముక్తి అనగా సర్వప్రతిబంధరహిత ఆత్మసాక్షాత్కారము సులభముగా లభించును. విషముచే మతిదప్పిన వాడెట్లు తెలివిదప్పి పడిపోవునో అదేతీరున అహంకార మను గ్రహముచే యావరింపబడిన మూర్ఛితుడు ఆత్మస్వరూప జ్ఞానరహితుడై తానెవ్వడనియు తెలియనివాడై వ్యవహరించుచున్నాడు. అవిద్యారూప సంసార మున పతితుడగుచున్నాడు కావున అహంకారమనునది యెంతదుస్థితి హేతువో

గమనింపవలెను. మఱియు విషము ఎంతకొంచెమైనను శరీరమున ప్రవేశించె నేని అదిరక్తనాళములద్వారా వెంటనేదేహమంతయు వ్యాపించినదై ప్రాణంనే హరించుచున్నది ఆతీరుననే దుర్విషయ విషయసంకల్పములకు మూలమగు అహంకారము ఏకొంచమైనను యున్నయెడల విస్తారంచెందినదై నిర్మలబుద్ధిని కూడ చెరచుచున్నది ఇట్టివానికెన్నటికి శాంతిలేదు.

కాబట్టి సర్వానర్థహేతువగు యీయహంకారమును శ్రీద్ధవహించి నిశ్శేషముగా నశింపజేసిన అహంకార కార్యభూతములగు అనేక విధవికల్పములు వికారములు కర్తృత్వభోక్తృత్వాదులు స్వయముగా వెంబడేనాశనమును జెందు చున్నవి. అందుచే అంతరాత్మయొక్క వివేకము అనగా ఆత్మయే పరమాత్మ యను విజ్ఞానము నిరావరనమై భాసిల్లును ఇట్టిజీవపరమాత్మల వివేకముచే యీ పరబ్రహ్మమే నేనను యథార్థమైన విశుద్ధతత్వమును పొందగలుగును. అహంకార నివృత్తిచే సకలానర్థములు తొలగి ఆత్మతత్త్వ వివేకముచే అపరబ్రహ్మమే తానను ధృఢనిశ్చయానుభవ జ్ఞానము గలవాడగును.

శ్లో॥ అహంకార మహాగ్రహః, నిమజ్జయతి సాధరాన్।
ప్రబోధ విష్ణుచక్రేణ, తంఖండయత హేబుధాః॥

అనగా అహంకారమను మొసలి సంసారసాగరమున సాధకులను ముంచివేయు చున్నది సోఽహంకార ప్రబోధమను సుదర్శనచక్రముచే బుద్ధిమంతులగు ముముక్షువులారా అహంకారమును ముక్కలుముక్కలుగా ఖండించివేసి శాంతిని బొందుడు.

మఱియు నీవు సర్వదాఏకరూపుడవు, చిద్రూపుడవు, ఆనందమూర్తివి, మాయామాలిన్య దోషరహిత కీర్తిగలవాడవు, పరిశుద్ధుడవు, సర్వవ్యాపకుడవు యెప్పుడును యేలాటివికారమును జెందనివాడవు. కావున నీకు భ్రాంతిచే కల్పింపబడు మగు దెహాత్మభావనారూపమగు అహంకారమే సంసారము దానిని విడచిన సంసారబంధములేదు అందుచే అహంకారమునుండి విడివడి నీ స్వరూపమందుండుము ఎందుకనగ అనాత్మపదార్థములయెడ అహంత్వ మమత్వ రూపాభిమానమనెడు దురహంకారమే దురవగాహసంసారము తనకు స్వస్వరూప ఖండకమగుటచే పరమ శత్రువు భోజనము చేయుచున్న సమయమున గొంతులోపల యొకకంటకము తగులుకొనిన వానిదాధయెటుల తీవ్రముగానుండునో దానిని మ్రింగుటకును వెళ్ళగ్రక్కుటకును సాధ్యముగాక ప్రాణాంతకమై వుంటు

మెటులయుంటున్నదో అప్రికారము యీఅహంకారము మహాబాధాకరమును నై స్వస్వరూప సాక్షాత్కార బ్రహ్మానందానుభవమునకు పరమ ప్రతిబంధకమై యున్నది విడుచుటకును కంఠస్థ కంటమువలె దుస్సాధ్యమై అత్యంతికమై యీ యహంకారమొప్పుచున్నది గొంతులోనుండు ముల్లును మెల్లగా పట్టుకారుచే నూడబెరికిన ధీమంతుడు సుఖముగా ఆహారమును భుజించుచున్నాడు. సుఖజీవితుడగుచున్నాడు ఆనందానందమును బొందుచున్నాడు విచక్షణాజ్ఞానము గలవాడు యీ యహంకారమును నెమ్మదిగా(దొలగించిన స్వాత్మానందమను భవించుచు స్వస్వరూపస్థితి జీవనమునుబడసి నిరవధికానందమును బొందుచున్నాడు. కావున ఏవిధముగనైన నీయహంకారమును నశింపజేసి యప్రతిహతముగా యపరిమితసహజానందమునుభవించుటయే పరపదవినొందుటయగును అహంకారము మోక్షమునకు చాలప్రతిబంధకము. ముముక్షువునకు వానితీవ్రేచ్ఛను నశింపజేయుటలో పరమశత్రువు ఇట్టి అహంకారమును నిగ్రహించి విషయాదుల తలంచుటయను అవకాశము నాకించుకేనియు ఎప్పుడైనను ఆయహంకారమునకును ఈయజనదు ఏలయనగా నిమ్మచెట్టు పూర్తిగా ఎండిపోయినను వేర్లుమాత్రము ఎచ్చిగాయండినచో తిరుగా జలముపోసినయెడల యథాప్రకారము చిగురించి వృద్ధిగాంచును. అతీరుననే ఈ దుష్టయహకారమును నాశముగావింపబడినను విషయసంకల్ప మాత్రముచే మరలవిజృంభించి దానికార్యము జేయుచుండును కావున అహంకారమును దానికారణమగు అజ్ఞానమును సమూలముగా నశింపజేయవలయును. మరియు కంద అరటి మొదలయినవి అడుగు భాగమువరకు నరికి వేయబడినను పూర్తిగా కనబడకపోయినను మరల నీటి సంపర్కముచే మొలకలెత్తుచున్నవి ఆలాగున అహంకార వృక్షము గూడ విచారణాజ్ఞానమును ధ్యానమును అనుష్టించుచున్నందున నశించునటుల కనబడినను కొంచము యేమరపాటుగలిగినప్పుడు విషయ చింతనామాత్రముచే పూర్వమున్నట్టులనే అహంకారమువృద్ధినొందును కావున స్వయంప్రబోధమను మహాజ్ఞానాగ్నిచే నీఅహంకారవృక్షమును సమూలముగా దహింపజేసిన తిరుగా జన్మింపనేరదు విషయచింతనాంకురములెయుండవు. అప్పుడు స్వస్వరూపజ్ఞానము సుదృఢమగుచున్నది. వృక్షముయొక్క జీవనహేతువులగు వేళ్ళను ఛేదించిన వృక్షము బ్రతుకజాలనటుల నీయహంకారమూలమగు మూలావిద్యను నేను బ్రహ్మమను అహంకారసాక్షిని అనువిజ్ఞానముచే నీయహంకారము స్వయముగా

నశించుచున్నది తిరిగియెన్నటికి యుండజాలదు.

దేహాత్మ బుద్ధిగలవానికి తద్విలక్షణునకు మిక్కిలి భేదముండును. విష యాదులయందు పరమాభిలాషచే యావిషయములు సుఖకరములను బుద్ధిచే యింద్రియ సుఖాభిమానమందు దిగులుకొనినవాడు దేహమేనేనను అజ్ఞానముచే నుండును. అట్టివాడు దేహాభిమానబుద్ధిగలవాడు ఇట్టిదేహాత్మబుద్ధిగలవానికిన్న విలక్షణుడు ఆత్మానాత్మవిచార సంపన్నుడు దేహము నేనెంతమాత్రముకాను. దేహేంద్రియములను ఎఱుంగుచుండు విలక్షణమూర్తియైన ఆత్మయేనేను అని సర్వదాతలంచువాడు దేహముతో నుండియున్నను దెహాత్మబుద్ధిగలవాడగును. విషయ సుఖాపేక్ష గలవాడుగను కాడు ఈతడు జాని ఆత్మయోగిగను కాజా ...డు జీవుడు వేరు దేవుడు వేరు నేను దుఃఖిని, ఈలాటి భితిచే విషయాదు ...ను చింతించుటయే కామ, క్రోధ, లోభములకు హేతువగు సంసారబంధ కారణమగును ఇందుచే ముముక్షువెప్పుడును పరస్వరూపియై యుండుటచే విష యాదులను చింతింపక యుండినందున సంసారబంధ విముక్తుడగుచున్నాడు. కాబట్టి నిష్కాముడై పరబ్రహ్మమందు స్థిరుడై యుండవలయు.

ఈప్రపంచము శబ్దస్పర్శరూపాది యింద్రియార్థములు వాగాది శరీర సంఘాతము ఇవియన్నియు అజ్ఞానకార్యములు. కార్యమగుదృశ్యజాతమంతయు వివేకముచే నిరోధింపబడగా అనగా వాటిపైనాసక్తి నశించగా కారణమగు అజ్ఞా ...ము స్వయముగా నశించుచున్నది. వృత్తులు విషయములు సహాయసామగ్రి ...నే వృద్ధినొందుచున్నవి. ఆ సామగ్రియే లేకుండిన కారణభూత విషయ ...లు క్రమముగా వినాశమొందుచున్నవి. ప్రపంచవిషయములు వృద్ధియగు ...లది కారణభూతరాగద్వేషములు వాటి సంస్కారములు వృద్ధియగుచునే ...యుండును ప్రపంచవిషయములను సంస్కారములను వృత్తులను దూరీకరిం... స్వయముగా నజ్ఞానపుంజము నాశమొందును సంకల్పముల రాశియే ...నన్న అంతఃకరణ దోషములనే పూర్తిగానశింపజేసిన ఇట్టి అంతఃకరణమెక్క... కావున కార్యనాశముచే కారణము విలయమొందును ఒకమహావృక్షము ...లు కొమ్మలతోసహా ఎండిపోవుచున్నది క్రమముగా దానిమూలవేరుగూడ ...చును ఈలాగున బాహ్యచేష్టలు ఆడంబరములు దృశ్యవృత్తులు పరచిం... అత్యనుతులు నిరోధింపబడినచో వాటికారణమగు నవివేకముగూడ విలయ ...ందును చిత్తవృత్తులు నిషేధింపబడిన కారణమగు చిత్తమును విల

మైయుండును. కావున బాహ్యావృత్తులు దృశ్యము దూరీకరింపబడిన అంతఃకరణ వృత్తులును దూరీకరింపబడును. కాబట్టి ముముక్షువు కార్యభూత దృశ్యనిషేదము వశ్యముగావింపవలయును. ఇంకను కార్యమువృద్ధియగుచుండిన కారణవృద్ధియు గనుగొనవచ్చును. యెటులన ఒకచోట దూమము (పొగ) ప్రబలముగా బయలుదేరుచుండిన దానికి కారణమగు నగ్నియు మహత్తుగా నున్నదనియు యూహింపనగును. ఒకవృక్షము పుష్పములు, ఫలములు, కాయలతో శాఖోపశాఖలతో పెరుగుచుండిన దానికి మూలమగు తల్లివేరున్ను ధృఢమై పెద్దదియై యుండును మేఘము మందమందముగా భారముగలదియై ఆకాశమందు సంచరించుచుండిన జలముతోభరితమై యుండుననియే తలంపవలయును ఈ ప్రకారము కార్యసిద్ధిచే కారణాభివృద్ధియు గనుగొనవలయును. కాబట్టి హృదయ క్షేత్రమున శబ్దస్పర్శ రసరూపవనితాది విషయవృక్షము సంకల్ప, వికల్ప శాఖోపశాఖలతో విస్తృతమై వృద్ధిగాంచుచుండినచో తత్కారణమగు అజ్ఞాన బీజము ప్రబలమైయున్నదనియే నెంచవలయు. ఎంతవరకువృత్తులు దయించుచుండునో అంతవరకు అవిద్యసంపూర్ణముగా నశించలెదనియే స్పష్టమగును. ఇందుచేతనే కార్యకారణములతోసహ అజ్ఞానమును తత్కార్యదృశ్యమును ముముక్షువు నశింపజేయవలయును. అప్పుడేనిర్వాసనాస్థితి గలుగును.

ఇక హృదయాంతఃకరణమున కారణ భూతమలిన సంస్కారములు హత్తుకొనియుండిన కార్యభూతదుష్టసంకల్పములు మలినవృత్తులు అవివేకము మొదలయినవి పుంఖాను పుంఖములుగా నావిర్భవించుచునేయుండును సముద్రములో వాయువున్నంతవరకు తరంగములుపశమింపవు అలాగున హృదయములో అజ్ఞానబీజమున్నంతవరకు వృత్తులునశింపవు. దుర్వృత్తులు ప్రవర్థమానమగుచుండిన వాటికి కారణభూతమలిన సంస్కారములును ప్రబలమగుచునేయుండును కావున కారణవృద్ధిచే కార్యవృద్ధియు కార్యవృద్ధిచే కారణాభివృద్ధియు గలుగుచునేయుండును అటులనే కారణనాశముచే కార్యనాశము కార్యనాశముచే కారణనాశనము గలుగునని తెలియవలయు జన్మపరంపరలకు సంసారసహితమగు వృత్తులే కారణములు. ఆవాసనలచేతనే తిరుగా జన్మమరణములు గలుగుచున్నవి జన్మవచ్చినందుచేతనే నానావిధవృత్తులు వాటికనుకూలమగు సంస్కారములు యేర్పడుచున్నవి. ఈలాగున సంసారము నివర్తించుటలేదు. ప్రవాహరూపముగా సంస్కారబలిమిచే జన్మలు వచ్చుచునేయున్నవి. కాబట్టి

ముముక్షువు శ్రద్ధగలిగి సంస్కారములు నశింపజేసికొనవలయును. కార్యకారణ ముల నశింపజేసినవాడు సంసారబంధముక్తుడగుచున్నాడు.

పరిదమమున శుద్ధకర్మలు శుద్ధసంకల్పములచే మలిన సంకల్పములను పుణ్యపురుషుల స్నేహము పుణ్యకర్మానుష్ఠానముచే పాపబుద్ధిని దూరీకరించిన. స్వానుభవ జ్ఞానముచే పిమ్మట శుద్ధసంకల్పములను వీడి పుణ్యాతీతుడునై ఇచ్చోటనే ఈశరీరమున్నప్పుడే ముక్తుడగుచున్నాడు

అజ్ఞానముయొక్క బలిమిచే జన్మజన్మాంతరములనుండియున్న మలిన సంస్కారము (అనాత్మభావన) ఆత్మేతరవిషయములను సంకల్పించుటచేతను తదనుగుణ కార్యములాచరించుటచేతను అనంతముగా వృద్ధిపొందినదై సంసారమును జీవునకు కలుగజేయుచున్నవి, అనగా ఉత్తరోత్తర జన్మలకు గూడ సంస్కారణమేకారణమై జీవుని జననమరణరూప సంసారవారిధిలో పడవేయుచున్నదని తెలియవలయును. తనయొక్క అనాత్మభావనయే అజ్ఞానమునకు తజ్జన్యకార్యములకు హేతువని తెలియవలయు కావున జన్మపరంపరాగత సుస్థిరసంస్కారము అనాత్మభావనలు తత్కార్యములు. ఈ మూడింటిని నాశమొనరించు యుపాయమును వరాకురేక సర్వకాల సర్వావస్థలయందును చేయవలెను

ఈశరీరమున్నంతవరకు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు తప్పవు. అవి యున్నంతవరకును సంస్కారములు గలుగుటకవకాశమేర్పడ చునే యుండును కావున యెప్పుడును పైజెప్పిన మూడింటిని నాశమొనరించు యుపాయమును ఆచరించవలయును.

శ్లో॥ సంసారేఽస్మిన్ మహావృక్షే బీజభూతాహి వాసనాః
అనాత్మభావనాస్సర్వా స్కంధరూపేణ సంస్థితాః॥

టీ॥ అనగా సంసారమును మహావృక్షమునకు మలిన వాసనలు బీజములుగా నున్నవి అందున అనాత్మభావనలన్నియు వృక్షమునకు మొదలుగాయున్నవి ఆని కార్యములగు సర్వవిషయాదులు సర్వశాఖోపశాఖలుగా నుంటున్నవి. అంసాదమను అజ్ఞానవృక్షము హృదయక్షేత్రమున సంస్కారబీజములచే నాటబడి అనాత్మసంకల్పస్కంధములతోవృద్ధిజెంది విషయసుఖాది శాఖోపశాఖలతో విస్తరిల్లియున్నది అద్దానిని శమదమగుణములుగల జితేంద్రియుడగు ధీరుడైన బుద్ధిమంతుడు అనగా ముముక్షువు. యెల్లప్పుడు జాగరూకతతో విజ్ఞాన

మహాఖడ్గముచే అవశ్యము ఛేదింపవలయు అప్పుడే పరమశాంతిచేకూరును. కనుక సకల దృశ్యవాసనలు సంకల్పములు వాటిచే గావింపబడు సకలకార్యములు అజ్ఞానముచే గలుగుచున్నవి. అజ్ఞానమనగా తనను తాను దెలియకపోవుట చేతనే జీవత్వమును సంసారగతియును వాటిల్లుచున్నది. కావున తాను ఆ పరమాత్మయే ఆత్మయనగా బ్రహ్మయేయని తెలిసికొని సోఽహం భావనారూఢుడై బ్రహ్మస్వరూపుడగు విజ్ఞాని అజ్ఞానమును నశింపజేసినవాడగుచున్నాడు.

అన్నిచోట్లను అన్నికాలములయందును అంతటను ఆపరబ్రహ్మమే పూర్ణమైయున్నది.

శ్లో॥ దృష్టింబ్రహ్మమయీంకృత్వా. సంపశ్యేత్

అనురీతిగా దృష్టిని బ్రహ్మమయముగా జేసి చూడవలయును ॥శ్రుతి॥ కావున ఇదియంతయు బ్రహ్మమే అను బ్రహ్మదృష్టిచే॥ సోఽహం శివోఽహం అహంబ్రహ్మాస్మి॥ మొదలగు మహావాక్యములచే బోధితమగు పరబ్రహ్మభావము క్రమముగా ధృఢపడుచున్నది. ఇట్టి బ్రహ్మభావనా దార్ఢ్యముచే అనాత్మభావనలు వాటికారణమగు సంస్కారములు వాటిచేనావహిల్లెడు సంసార సంతతి ఈమూడును లయమొందుచున్నవి. ఇందుచే తాను పరబ్రహ్మమగుచున్నాడు. మరియు

సంస్కారములనగా నజ్ఞానమును విడిచివేరుగాలేవు. అజ్ఞానమే సంస్కారములు. అజ్ఞానము బీజరూపముగానుండుటయే సంస్కారమని పెద్దలు వచించెదరు.

ఇట్టి బీజరూప సంస్కారసంజాతమే అనేకజన్మములనుంచి జీవుని వెనువెంట వచ్చుచున్నది దీనినే అవిద్యాగ్రంథియనియు. మూలప్రకృతియనియు. అవిద్యాబీజమనియు, మోహమనియు అరిషడ్వర్గములనియు, మాయయనియు పరిభాషా పదములచే వేదాంతులు వ్యవహరింతురు. ఇంతకు దీనికార్యమేమనగా ప్రజ్ఞారూప స్వస్వరూపమును మరుగుపరచి విస్మరింప (అనగామరిపించి తెలివియక) జేయుటయేయగును కావున సకల బీజరూప వాసనలయొక్క నిశ్శేష నాశమే మోక్షము. ఇదియే అవిద్యాగ్రంధి విచ్ఛిత్తియగును. ఈ యజ్ఞానమను ముడి తొలగిన ప్రతిబంధరహితమై ఆనందవిస్ఫూర్తి జనించును ఇదియే జీవన్ముక్తి. కాబట్టి సకల సంస్కారనాశము ముముక్షువుచే జేయదగియున్నది. వాసన యనగా మలినానువులతో గూడిన అజ్ఞాన బీజము. తద్వ్యాప్తి యంతః

ంరణమున అల్లుకొని యుండుటయేవృత్తి ఆవృత్తి వలన బీజమునుండి జలనేచ
ంముచే మొలకలు బయటికి వచ్చునటుల కర్మపరిపాకముచే సంకల్పములు
ంలుగుచున్నవి. ఆసంకల్పములచే సనేకవిధ కార్యములు జేయుచున్నాడు.
ంజాంకురమే ప్రవృద్ధమై కొమ్మలతో నొప్పారునటుల నీసంకల్పాంకురములే
ప్రవర్ధమానములై కార్యకరణరూపకొమ్మలు గలవియగుచున్నవి. అనగా
మొదట బీజము తరువాత నంకురము తరువాత కొమ్మలు ఈప్రకారము వృక్ష
మేర్పడునటుల సంస్కారములు సంకల్పములు కార్యములు ఈవిధముగా పరిణ
ుంచి సంసారవృక్షమేర్పడుచున్నది వృక్షము సమూలముగా నాశము జేయ
ంలసినచో కొమ్మలను చేదించి తరువాత మొదటి భాగమును నరికి వేరులను
ూడ చేదించుచున్నారు. అందుచే వృక్షనాశముగలుగును. అలాగున హృదయ
ున అనేక చింతలు కలుగుచున్నవి ఆ సంకల్పానుసారముగా జీవుడు కార్య
ులు జేసినచో నాసంకల్పములు పెరుగుచునేయుండను.

అట్లుగాక సంసారబలిమిచే చింతలుదయించినను తత్సంబంధకార్యములు
యకుండిన కట్టెలులేనిచో అగ్నిస్వయముగా నశించినటుల నీచింతాగ్నియు
్వయముగనే శాంతిల్లును. తరువాత నగ్నియు భస్మమగునటుల చింతయు
ార్తిగా నశించిపోవును. అందుచే సంస్కారములు గూడ లేకపోవును. ఏ
ెక్క సంస్కారములు వృత్తులు, గుణములు లేకపోవుటయే సంపూర్ణవాసనా
ాహిత్యమగును ఇదియే మోక్షము దీనినే జీవన్ముక్తియని చెప్పుచున్నారు.
ంఱియు నెంతటి మహావృక్షమైనను పైజెప్పిన క్రమముగాక త్వివ్రకుంకుటి
వేళ్ళను ముందుగా నుపాయముతో చేదించిన నామహావృక్షము సమూలముగా
ాలిపోవును, అలాగున మహాధీరులైన ప్రజ్ఞావంతులు అనేకజన్మములనుండి
ంనాదిగానాటుకొని ప్రవర్ధమానమైయున్న ఈ సంసారవృక్షమును జితేంద్రి
ములై, నిష్కాములై, నిరంతరస్వరూప ధ్యానసిద్ధులై, విశాలహృదయులై,
ాహంబ్రహ్మాస్మి॥ నేను బ్రహ్మమును అను విజ్ఞానఖడ్గముచే సకలసంస్కార
ంసు వ్రేళ్ళను ఛేదించి అజ్ఞానధ్వంసకులై పరమానంద జ్ఞానస్వరూపులై
ృప్తి చెందుచున్నారు.

ఇక అంధకారమెంతగొప్పదిగానున్నను అనాదిసిద్ధమైయున్నను సూర్య
ంణ ప్రసారముగలుగగానే ఎప్పగాకనబడకనేపోవును ఆతీరున నహంకార
ంమకారాది వాసనలు మిగులపడియున్నను తద్వారా అజ్ఞానమిశ్రమము

ఽనాదిసిద్ధమై విజృంభించుచుండినను ఆదియంతయు నేను పరబ్రహ్మను వేఱు గాదు సచ్చిదానందస్వరూపుడను అనుధృఢ ప్రజ్ఞాజ్యోతిస్వరూప ప్రజ్వాల్యమై త్సంస్కారము అంతఃకరణమున స్థిరముగా నాటుకొనెనేని అట్టిధృఢతర పర బ్రహ్మవాసనా భాస్కర భాస్వరప్రభ సమర్ధమగు చున్నదని తెలియవలయు. అటియు నంధకారము గుహయంతయు వ్యాపించియున్నను అటులనే గృహ ములలోను పూర్తిగా వ్యాపించినను అలాగున ప్రపంచమంతయు నీతిమిరము టుకవృష్టివలె ప్రసరించి యున్నది. ఈ అంధకారకార్యమేమనగా నున్న స్తువుదెలియనీయకస్థాణువును పురుషునివలెను లేక పిశాచమువలెను తోపింప యుచు యదార్ధము దెలియజేయకుండుటగును.

అకాలముననందఱు ప్రజ్ఞనువదలి సకలవ్యవహారములనుడిగి నిద్రిం రు. అటులనే నీయజ్ఞానమహాతిమిరము సర్వభూతహృదయ కుహరములలో ్యపించినదై రజ్జుసర్ప న్యాయమున లేక శుక్తి రజితన్యాయమున మధ్యాభూత గు నీప్రపంచమునంతయు సత్యముగా దోపింపజేయుచు ధీర్ఘతర మహా సార సుషుప్తియందు జీవులను ప్రజ్ఞావిరహితులనగా జేయుచు సర్వాత్మ ద్దీని కప్పిపుచ్చి జ్ఞానవిరహితదశలో బరుండునటుల జేయుచున్నది ఐనను హలలోకాని గృహములలోకాని మహానిబిడమై వ్యాపించియున్న చికటిని రద్రోలుటకు అంధకారమంత దీపమావస్యకములేదు. ఒక చిన్నదీపము వెలి చినను తక్షణమే యా చీకటియంతయు బరుగిడుచున్నది. దీపమున్నంత కు యేమూలనుండియు చీకటిదీపముదరికిరాదు అలాగున శ్రద్ధచే వివేకము ్మనాత్మ విచక్షణత్వము గలిగి నిరంతర స్వస్వరూపా ధ్యానపరు...ం ముము నకు యేపరుపాటువేని 'అహం బ్రహ్మస్మి' అను జ్ఞానము కొద్దిగా గినను బహుకాలమునుండి హృదయములోనే స్థిరముగానున్న యజ్ఞానంధ ము తొలగిపోవును ఈ స్వానుభవజ్ఞానము స్థిరముగా నారూఢమైనచో ్రకిరణుడు సహస్రముఖ ముఖములుగా వ్యాపించి కిరణప్రసారము చేతనే టినంతయు వెళ్ళగొట్టునటుల నీమహాంధవిజ్ఞానముకూడ ప్రపంచపుం యు బ్రహ్మమయముగా జేయుచు సర్వవ్యాప్తమగును ఇదేవిషయమును సద్వా స్ఫూర్తి విజృంభణే, అనువాక్యముచే విదితమైనది. అనగా హృదయమున్న ్వసనలు మలినవాసనలు రెండును యుంటున్నవి. సద్వాసనలనగా శుద్ధ స్కారములు, ముక్తిహేతువులు. మలినవాసనలనగా అశుద్ధసంస్కారములు

జన్మమరణ సంస్కారమునకు కారణములు స్నానశౌచములు దానధర్మములు జపతపములు బ్రహ్మవిచారముచే బ్రహ్మము తానను దృఢభావనలు ఇత్యాదులన్ని సద్వాసనకు జెందినవి. పరబ్రహ్మముఖగమనముగా యున్నవి. అజ్ఞానజన్మములైన నేను నాదియను అహంకార మమకార వాసనలు మలినములయి మోక్షప్రతిబంధకములై సంసారాభిముఖమై యున్నవి. అందులో నుత్తములైనవారు అసద్వాసనలను మలినవృత్తులను దరిజేరనీయక సద్వాసనల నాశ్రయించినవారలై పరబ్రహ్మ భావనారూఢులై మోక్షదామము నధిష్టించియుందురు. ఇకమధ్యములుగానున్నవారు కొన్ని సంస్కారములావహించినను అవి ప్రకృతిసిద్ధములని గుర్తెఱింగి విచారణాజ్ఞానముచే బ్రహ్మవిషయక సంస్కారములనే బలపరచుచు మలినవాసనల తిరస్కరించుచు నిత్యనియమనిష్ఠా పరాయణులై యుందురు. వీరును పకృతికి చోటియ్యకుండిన కొంతకాలమునకు సాధనద్వారా యుత్తములగుదురు మధ్యములలోనే మఱియొకతెగ గలవారు గలరు. వీరు శుద్ధశుద్ధ వాసనల సమానముగా గలవారు కొంచెము సత్తులో యుండి ప్రయత్నించిన ఉత్తములగుదురు. ఇక కనిష్ఠులలో పూర్వజన్మ సుకృత విశేషలేశముచే శుద్ధసంస్కారములగు వైరాగ్య భక్త్యాదులు కొద్దికొద్దిగా పొడసూపుచుండినను మలిన వాసనలు ప్రబలముగాయున్నందున తిరుగా సంసారప్రవృత్తులైన అహమాదికారములందే ప్రవర్తింతురు. వీరలు కర్మోపాసనలు నిరంతరము చేయుచుండవలయును. ఇకను ఉత్తమోత్తములున్నారు ఈ ప్రజ్ఞానిధులు ముందుగనే ప్రకృతిరహస్యమును గుర్తెఱింగిన వారగుటచేతను యాప్రకృతినినిరసించిన వారగుటచేతను నిరావరణ బ్రహ్మతత్త్వము నొందిన వారగుటచేతను సద్వాసనా అసద్వాసనలకతీతమగు పరబ్రహ్మమయ్యేయుందురు వీరేఅఖండ పరిపూర్ణజ్ఞానులు రాత్రియవగా చీకటి బాహ్యప్రపంచమును మాత్రము కప్పివేయును బాహ్యవస్తువులనె తెలియనీయజాలదు. అంతమాత్రమే ఈ బాహ్యాంధకారము దీపములచేతను లేక విధ్యుద్ధీపములచేతను పోవుచున్నది సూర్యప్రకాశముచే పూర్తిగాలేకపోవును ఇకను అజ్ఞానాంధకారమనునది మఱియొకచీకటిగలదు. ఇది అందరియొక్క హృదయములలోను అనాదిగానుండుచు గుహలో సూర్యునికిగూడ సాధ్యపడని పెనుజీకటివలె హృదయగుహలో స్థిరముగాయున్నది. ఈ చికటి సూర్యప్రకాశముచే నశించునదిగాదు. దీని విషయము శ్రద్ధతో విచారించవలయు ఈయజ్ఞానతిమిరముగూడ పైచెప్ప

బడిన చీకటివలె అందరియందు వ్యాపించియుండి యున్నవస్తువును ఉన్నటుల తెలియజేయకయున్నది. చీకటి యెట్లు తనశరీరము కనబడునటుల చేయువిధ మున ఈ అజ్ఞానాంధకారము తనయాత్మ స్వరూపమును కప్పిపుచ్చుచున్నది. విజ్ఞానమను నేత్రమును లేకుండాజేయుచున్నది. అందువలననే ఈ యజ్ఞానము నకును అంధస్సని పేరువచ్చెను. మఱియు నిది అంతఃకరణమందు లోపల వ్యాపించి అంతరాత్మను తెలియజేయకుండుటయేగాక బయటగూడ వ్యాపించి విజృంభించినదై, బ్రహ్మస్వరూపమగు ప్రపంచమంతయు బ్రహ్మరూపముగా తెలియజేయనీయక భ్రాంతినే గలుగజేయుచున్నది. విచారించిన ఈ అజ్ఞాన తమస్సు బాహ్యాభ్యంతరములయందును గ్రమ్ముకొనినదై బహిరంతరముల యందును పరిపూర్ణమైయున్న స్వస్వరూపపరామాత్మము తెలియజేయుటలేదు ఇట్టి అనంత దురంత హేతువగు అజ్ఞానంధాకారనాశమునకై ముముక్షువులగు సాధకులు మంత్ర జపధ్యాన సమాధినిష్ఠలను చిన్నచిన్న దీపములను వెలిగించు కొనుచున్నారు. మఱికొందఱు ప్రజ్ఞావంతులు దీర్ఘతర తపోనిష్ఠనియమములను పెద్దపెద్ద దీపములను వృద్ధి జేసుకొనుచున్నారు. ఇంకను కొందఱు మహా త్ములు స్వస్వరూప ధ్యాననిష్ఠులై జలమునుండి ఆవిరిని తీసి దీనిచే విద్యుదీప ములు తంతులద్వారా ప్రకాశింపజేయునటుల తనయొక్క అంతఃకరణమను జలరాశిని మనోయంత్రముచే ధ్యానమను మధనముచేసి ఆత్మప్రకాశశక్తి యను విద్యుచ్ఛక్తి బడసినవారై దేహములోపములనుండు నరములద్వారా ప్రకాశింప జేయుచు ఆత్మనుపరమాత్మను తెలియుచున్నారు. ఇకను అఖండ పరిపూర్ణ జ్ఞానులైనవారలు పరమాత్మయొక్క అనంతమగు కరుణచే అఖండపరిపూర్ణ విజ్ఞానమను భాస్కరోదయము గలుగగా పరిపూర్ణముగా అజ్ఞానాంధకారము నశించి మహాస్వానుభవ జ్ఞానమనబడు పగటియందున్నవారై స్వాత్మవిస్మృతి యను నిద్రనుండి మేల్కాంచినవారై స్వస్వరూపస్థియందు జాగ్రత్తగలవారలై పరబ్రహ్మమందు విహరించుచున్నారు వీరు అఖండాత్మ శక్తిగలవారు ముందు జెప్పబడినదీపములు గాని విద్యుద్దీపముల వంటి జ్ఞానములు, స్థిరములు గావు. అఖండాత్మశక్తితోగూడిన విజ్ఞానమను సూర్యుడో యెప్పుడును నశించు వాడు కాడు స్థిరదాయుండువాడు

ఇక విచారించిన సూర్యుడుఎల్లప్పుడును ప్రకాశించుచునే యున్నాడు. ఆయనకు ఉదయాస్తమయములులేవు భూమి యొక్క గతిచేతనే రాత్రింబ

వళ్ళు యేర్పడుచున్నవి. అలాగున ప్రజ్ఞానాత్మస్వరూప జ్ఞానభాస్కరుడున్ను నిత్యతేజోరూపియై యున్నాడు. అపరమాత్మసర్వకాల సర్వావస్థలయందును స్వయంప్రకాశమానుడు అంతఃకరణ భేదముచే ఆత్మయొక్క ప్రకాశములేర్పడు చుండును. అంతమాత్రమే వేరుకాదు. అంతయు పరబ్రహ్మమే. నిరావరణమై సర్వపరిపూర్ణమై అఖండతేజోవిజ్ఞానరూపమై యున్నది. దానియందు అజ్ఞానమనునదిలేదు శివమై అద్వయమై పరిపూర్ణబ్రహ్మమే సత్పదార్థము పరమానందస్వరూపము. "నచదుఃఖగంధః" అను వాక్యముచే దుఃఖలవలేశములేనిదై యున్నది. అనగా అఖండాత్మరసానుభవము గలిగిన కొంచెము దుఃఖముగూడ యుండదు. అంతయు ఆనందమయముగనే యుండును. అజ్ఞానముండిన కదా. దుఃఖముగలుగును. అదియే లేనప్పుడు శోకమెక్కడిది "కోమోహః కశ్శోకః ఏకత్వమను పశ్యతః" జీవబ్రహ్మైక్యతను అభేదమును చూచువానికి శోకమోహములుండవు. అని శృతియుపైజెప్పినదానినే తెలుపుచున్నది. అ బ్రహ్మానుభవము అమృతమయము అదెటులనగా ప్రచండ సూర్యుడు తేజోవంతుడై ప్రజ్వరిల్లుచుండగా అచ్చోటయే కొద్దిచీకటియైన యుండదుగదా. అటులనే పూర్ణిమనాడు పరిపూర్ణచంద్రుడు పండువెన్నెలతో ప్రకాశించుచుండగా తాపముండదు. అంతటను చల్లదనమేయుండును. చీకటియునుండదు అలాగుననే జ్ఞానసూర్యుడు దేదీప్యమానంగా అజ్ఞానమయమైన చీకటి యెక్కడుండ గలుగును. అంతయు జ్ఞానజ్యోతిర్మయమే అచ్చట ప్రకాశములేదు. మఱియు పరమశాంతియును పరిపూర్ణత్వము సర్వత్రవ్యాప్తమై యుండగా, సంసారదుఃఖ తాపములుండునా? శోకతిమిరముండగలుగునా? ఉండదు. ఒకవేళ అంధకారముండిన సూర్యోదయము చంద్రోదయము కానటుల తెలియవలయును. కాబట్టి స్వస్వరూప దివ్యానుభవము నిశ్చయముగా గలిగియుండిన దుఃఖమనునది యుండదు. వారి వ్యావహారమంతయు ప్రశాంతమై ప్రసన్నమై యుండును. వారు 'ఆత్మప్రబోధ చంద్రోదయముచే పరిపూర్ణసుఖశాంతి రూపచంద్ర కిరణములలో విహరించుచుందురు వీరినెఱుంగుటరుదుగా యుండును.

మఱియు ఒకవేళ మలిన కర్మవాసనాదులు పూర్తిగా నశించక మిగిలి యుండిన యెడలను ఇంకను కొన్ని సంసారములు నిశ్శేషముగా నశించక యుండిన యెడలను హృదయమందు విక్షేపములు గలుగవచ్చును దృశ్యము గూడ స్ఫురించి విజృంభించవచ్చును. అట్టి యెడ సకల విక్షేపనాశనమునకై

బాహ్యేంద్రియ అంతరేంద్రియముల నిగ్రహించినవాడై బహిరంతరముల యందు పరిపూర్ణమై యుండు పరబ్రహ్మమందు చక్కగానుంచబడిన మనస్సు గలవాడై ముముక్షువు దృశ్యమునకేమాత్రము అవకాశమునొసంగక దృశ్యమును కొంచముగూడ స్ఫురింపనియక అద్దానిని, వివేకముచే నశింపజేయుచు, సద్రూపుడై ఆనందఘనుడై, ధైర్యము విడువక పరబ్రహ్మమై యుండవలయు అప్పుడు ప్రకృతి పటాపంచలగును. ఈ రీతిగా పరమానందముతో ప్రజ్ఞానఘనముతో పరమాత్మయందు విహరించుచు పరిపూర్ణబ్రహ్మమై కాలము గడుపవలయు. ఒకప్పుడు దృశ్యము తోచుచుండిన దృక్కగు ఆత్మయందు చిత్తమునకు స్థిరత్వముగలిగెనేని దృశ్యమునశించి దృక్కైన ఆత్మయై యుండగలుగును. సాధకుడు తన నియమితకార్యమగు బ్రహ్మనిష్ఠను చేయకయు స్వస్వరూపమును మఱచియుండుటయు మాటలుమాత్రము గొప్పగా చెప్పుకొనుటయే గొప్పప్రమాదము దీనికన్న మరణము ముముక్షువులకు మరియొకటిలేదు. తనను తాను మరచియుండుటయే మహాప్రమాదము. అది మృత్యువుయని భారతమందు సనత్సుజాతీయమందునను సనత్సుజాతుడు ధృతరాష్ట్రమహారాజునకు చెప్పెను. కావున శరీరమును విడచుట బ్రహ్మజ్ఞానులకు మరణము కాజాలదు. తమయున్నతస్థితి నుండి జారిపోవుటయే గొప్ప ప్రమాదము మరణము తన స్వరూపమును మరచి అజ్ఞానములో పడియుండుటయే జీవునియొక్క అనంతత్వమును అనంతసుఖమును అడ్డుపరచినందుచే జీవహింసయనియును ఆత్మహింసయనియు ముఖ్యముగా వేదాంతశాస్త్రములలో చెప్పియున్నారు అద్దానినే బ్రహ్మమానసపుత్రుడు అనగా సనత్సుజాతుడు వచించెను. ప్రమాదమనగా దృశ్యమును ఆత్మలో స్ఫురించునటుల చేయుటయేయగును కావున దృశ్యమును ఆత్మలో చొరనీయక దృశ్యమగు అనాత్మభావమును వీడి హృదయమున సర్వదా ఆత్మభావనను వీడకయుండుటయే ప్రమాదరాహిత్యమగును. అప్పుడు తాను సర్వావరణ రహితుడై స్వయంజ్యోతి స్వరూపుడగుచున్నాడు. ఈ ప్రమాదవిషయమై భగవద్గీతా వాక్యమును చూడుడు.

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంస, స్సంగస్తే షుపజాయతే,
సంగాత్సంజాయతేకా మః , కామాత్క్రోధో౽భిజాయతే

శ్లో॥ క్రోధాద్భవతిసమ్మోహః సమ్మోహాత్స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥

॥తా॥ అనగా ధ్యానమునుమరచి ఇతర విషయధ్యానరూప ప్రమాదము వలన దృశ్యవిషయ సంబంధము గలుగుచున్నది. విషయసంగమముచే కామము, కామత్వముచే క్రోధము, దానిచే మోహము, దానిచే స్మరణము లేకుండుట ఇటుల వరుసగా గలుగుచున్నవి. స్మృతి నాశముచే బుద్ధినశించుచున్నది. బుద్ధియే లేకుండిన పురుషుడు పతితుడగుచున్నాడు. గనుక ప్రమాదమునకు కొంచెము సందిచ్చినచో అమరపుజేయు అనర్థములు అనంతములు, ఇందుచేతనే పురుషుడు బ్రతికియుండగనే మరుపు మృత్యువని పెద్దలు తలంచిరి. కావున ప్రకృతి ప్రమాదములోబడక జాగరూకులై ముముక్షువులు నిరంతర బ్రహ్మ నిష్ఠాపరులయి స్వానుభూతిని బొంది శాశ్వతసుఖము బడయవలయు.

ఇక జ్ఞాననిష్ఠగలవానికి స్వస్వరూప ప్రచ్యుతియను ప్రమాదము కన్న మించినచేటు వేఱొక్కటిలేదు అమరపను ప్రమాదము వలన మోహమును, ఆమోహము వలన కర్తృత్వ భోక్తృత్వరూప అహంకారము, ఆ యహంకారము వలన సంసారబంధమును, ఆ బంధము వలన జననమరణాది దుఃఖము ఇవి యన్నియు వరుసగా గలుగుచున్నవి. కావున ఆత్మను మరచి యుండుటను ప్రమాదమెప్పటికి గానీయరాదు. కాబట్టి సంతత తైలధారవలె అనవచ్ఛిన్నముగ అంతర్లక్ష్యము ప్రత్యగభిన్న పరమాత్మయందే నిలిపి ఆ లక్ష్యమును ఎరవకుండ వలెనని తెలియవలయును. "ఇందుకు" ప్రమాణశ్లోకము

శ్లో॥ నప్రమాదోఽత్రకర్తవ్యో విదుషామోక్షమిచ్ఛతా
ప్రమాదే విజృంభతే మాయా సూర్యాపాయేఽంకుమానివ॥

॥తా॥ అనగా మోక్షమునుగోరు ఆత్మధ్యానయోగి సోమరితనమును అంగీ యించగూడదు అలస్య అశ్రద్ధలను మరపును మహా ప్రమాదమగును. సూర్యుడు లేకపోగా రాత్రియను చీకటివలె మాయ విజృంభించును. గనుక ముముక్షువులు సర్వదా ప్రమాద రహితులై బ్రహ్మనిష్ఠయందుండవలయును ఇదే విషయమును పాతంజలయోగసూత్రమున చెప్పియున్నారు. "సూత్రము" అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః॥ అనగా అభ్యాసవైరాగ్యములచే యంతఃకరణ వృత్తులను నిరోధించుచుండవలయును. తత్రస్థితౌయత్నో ఽభ్యాసః॥ బ్రహ్మనిష్ఠయందు నిరంతరముండుటకు ప్రయత్నించడమే అభ్యాసము, "సతు దీర్ఘకాలనై రంతర్య సత్కారసేవితో ధృఢభూమిః" అనగా ఆ యభ్యాసము చాలాకాలము నిరంతరము అత్యంత ఆదరము ప్రీతితో కూడుకొనిన సుస్థిరత్వ

మొందును. ముముక్షువు మొట్టమొదట దీర్ఘతర వైరాగ్యముతో ప్రపంచమంతయు మిథ్యయనియు దుఃఖకరమనియు బ్రహ్మమే సత్యమనియు ఆనందకరమనియు తలంచి బ్రహ్మధ్యానమునకు ప్రారంభించవలయు సద్గురుకరుణయు దైవానుగ్రహమున సత్కర్మాచరణయు మహాత్ముల సాంగత్యము పరిపూర్ణముగా లేనందుచే (ప్రమాదమనునది) ఈవేళఇంతమట్టుకు ధ్యానము చాలును. రేపు మంచిదినము ధ్యానము ఇంకకొంతయెక్కువ కాలము చేయుదుము కొంచెము కొంచెముగా ధ్యానముచేయుట మంచిది. దీర్ఘముగా ధ్యానము చేసిన వ్యాధులు వచ్చును. అని తలంచుటయు ఆకలిలేనివాని భోజన ప్రవృత్తివలె మెల్లమెల్లగా కొంచెము కొంచెముగా బ్రహ్మధ్యానమునందు ప్రవర్తించుట పుణ్యసంస్కారము లేనందుచే మధ్యమధ్య బ్రహ్మధ్యానము వదలుట స్వరూపస్థితిని మరచియుండుట అంతయు తెలిసినటుల నటించుట ఇవన్నియు చెట్టునకు వేరుపురుగువలె తెలియకనే మెల్లగాచేరుకొని బ్రహ్మనిష్ఠుని అధఃపతితుని జేయుచున్నది. బ్రహ్మనిష్ఠనుండి జారిపోకుండుటకు పెద్దలసేవయు వారికరుణయు పూర్తిగా నుండవలయు స్థిరతర బ్రహ్మధ్యానము బ్రహ్మప్రాప్తి యొకేజన్మమునందు లభించుటలేదని తెలియవలయు.

శ్లో॥ నైవజన్మని సర్వస్మిన్ విద్యాఽసౌలఽభాపితు
శిష్యలక్షణ సంపూర్ణ జన్మన్యేవ హిలక్ష్యతే॥

॥తా॥ అన్ని జన్మముల యందును ఈ బ్రహ్మవిద్యా సులభముకాదు. శిష్యలక్షణములన్నియు యేజన్మమునందు పరిపూర్ణములగునో అట్టి జన్మమునందే బ్రహ్మవిద్యాప్రాప్తిగాననగును

శ్లో॥ ప్రమాద పంకపతితం మలినం పురుషం విదుః
తస్మాత్వం కమపాకర్తుం బ్రహ్మతీర్థం సుసేవ్యతామ్॥

॥తా॥ ప్రమాదమను బురదలో పడినవానినే మలినాత్మునిగా పెద్దలు తెలిపిరి. కాబట్టి అట్టిప్రమాద పంకనాశమునకై బ్రహ్మనిష్ఠయను తీర్థము దాగుగా ముముక్షువు సేవింపవలయును. మఱియు ఆత్మానాత్మ వివేకము గలిగియు తన స్వరూపమును మరచి నిరంతరము శ్రద్ధతో బ్రహ్మను సంధానము చేయకుండుటయనునది (ఆత్మవిస్మృతి)వేదవేదాంగాది తత్త్వవేత్తయగు పండితుని గూడ పతితునిగా జేయుచున్నది. తనకర్తవ్యమగు ఆత్మధ్యానమును విడనాడి స్వస్వరూపమును స్మరింపకుండిన అజ్ఞానమావరించుచున్నది. అందుచే పండి

తుడుగూడ లోకవార్తలయందును విషయాదుల యందు ప్రవర్తించుచున్నాడు అప్పుడాతడు వాసనా పరం పరలను చేయుచు మోహజన్యములై దుఃఖప్రాయములైన అస్థిరసుఖములను తలపోయుచున్నాడు. అప్పుడా పండితుని బుద్ధికూడ మాయామల విక్షేపదోషముంతో నావరింపబడుచున్నది. కనుక నాండుజ్ఞానహీనుడై విక్షేపశతములననుభవించుచున్నాడు. ఈ యాత్మవిస్మృతి పండితుడైనను విషయాభిముఖుడైనచో వానిని అనేక చిత్త మాలిన్యముల గలుగజేసి సంసారపతితునిగా జేయుచున్నది. సర్వదా బుద్ధికి మాలిన్యమునే గలుగజేయును చిత్తము స్థిరముగా నుండదు. ఇది దుఃఖమునే యిచ్చును శాస్త్రజ్ఞానమును దాని అర్థమును హరింపజేసి విజ్ఞానమునుగూడ గోల్పోవునటుల జేయును అందుచే నాతడు దారిలేక హీనాతిహీనుడై సంసారబంధ శృంఖలితుడై అనంత దుఃఖమునకు పాత్రుడగుచున్నాడు. ఈలాగున ప్రమాదముచే గలుగు నష్ట సంజాతమును తెలిసికొనవలయు. కాబట్టి యున్నతస్థితినిగోరు ముముక్షువు ప్రమాదరహితుడుగావలయు. ఇంకను ఆత్మమంచిపోవుటను ప్రమాదమును గూర్చి చక్కగా విచారించవలయును

చిన్నపిల్లవాండ్రు మేడపైన రబ్బరుబంతిచే ఆటలాడుచుండగా చేతి నుండి జారి ఆటలాడుబంతి పడిపోయిన వెంబడేనది మేడమెట్లనుంచి జారిజారి క్రిందికి పడిపోయెను. అనగా భూమిమీదపడెను. అలాగున మనస్సుగూడ తన లక్ష్యమగు పరబ్రహ్మమునుండి కొంచెము జారి తప్పినచో బహిర్ముఖమగుచున్నది పిమ్మట ప్రపంచోన్ముఖమై విషయాదులయందు ప్రవర్తించుచున్నది మొదట చెతినుండి చెండువలె పరబ్రహ్మమునుండి చిత్తముచ్యుతమాయెను చెండు మెట్టుమీద పడునటుల మనస్సు సంకల్పములమీద పడెను. అందుచే ఆ మనస్సు మెట్లయందు పతితమైన కందుకమువలె ఒకచోట నిలువక భూమి మీదపడునటుల శబ్దాదివిషయములవలన పతితమైన మనస్సు సంసారములో దగుల్కొని అధోగతిని పొందుచున్నది. ముముక్షువగు సాధకుడు నానావిధముులగా పరుగిడు మనస్సును తనయొక్క సూక్ష్మబుద్ధిచే అనేకవిధ ప్రయత్నములతో బ్రహ్మమందు నిలుపుచున్నాడు. అనగా ధారణ జేయుచున్నాడు. స్వస్వరూపమునందుండుచున్నాడు ఇట్లుండగా దుష్టసంస్కార బలిమిచే చిత్తము స్వస్వరూపాత్మనుండిజారిన దానినిఅతిజాగ్రతతో బహిర్ముఖముగానీయక ప్రపంచవిషయములలో పడనీయక జాగ్రత్తగా సంరక్షించు కొనుచుండ

లయును. యిదేవిషయమును ఉద్ధరేదాత్మనాఽఽత్మానం తనను తనచేత సం
క్షించుకొనవలెనని భగవద్గీతయు చెప్పుచున్నది. "బ్రహ్మతల్లక్ష్యముచ్యతే.
ప్రమత్తేన. వేద్ధవ్యమ్" బ్రహ్మము లక్ష్యము దానిని ప్రమాదములేక భేదించ
లయును. (చేర్పవలయును) అని ముండకశ్రుతి. పై విషయమునే చెప్పు
న్నది. అటుగాక మనస్సు స్వస్వరూపభ్రష్టమాయనా బంతియొక్క గతినే
ందును బంతిభూమిమీద పడిన తరువాత గూడ కొంతదూరము పోయి నిలు
ను. అతీరున అంతఃకరణముగూడ భ్రష్టమై కర్మపరిపాకమునుసరించి సం
రగర్తమున నిలుచుచున్నది. బ్రహ్మలక్ష్యము మహోన్నత ప్రదేశము
ంటిది. మనస్సుచేయెక్కునప్పుడునూ కడుజాగ్రతతో ఉండవలయును తుదకు
బహ్మలక్ష్యాగ్రము నధిరోహించు సమయమున చిత్తము కొంచెముజారెనేని
ర్వాతాగ్రము నుండి పడనవానివలె హీనగతిని జెందుచున్నది. తిరుగా లేచుట
స్తరమే దీనిని ముముక్షువులు సదా జాగ్రతతో ఆలోచించుచుండ వలయును
ంతిని గాలిని నింపి తయారుచేయుదురు. అందుచే ఆ బంతి చలనశక్తి గలదగు
న్నది. ఒకసారి హస్తముచే తాడితమైనచో ఆ కందుకము అనేకసార్లు దొర్లు
న్నది. ఆ ప్రకారము చిత్తముగూడ చలనాత్మక వాయువుచేతనే నిర్మితమై
ది. ఒకసారి దుర్వాసనాయను హస్తతాడితమైనచో అనేకసార్లు దుర్విషయ
ములలో పరుగిడుచున్నది. బాలురుబంతియాట ఆడుదురు. దానిచే వినోదిం
రు. ఆలాగున బాలురనగా అజ్ఞానులు యీపదము వేదాంత శాస్త్రమున అనేక
ర్లు ప్రయోగింపబడుచున్నది. ఇట్టివారు చెండుతో సమానమైన చపలాత్మక
నస్సుతో విహరింతురు. అట్టిచంచల మనస్సుతోనే రమింతురు మహాజ్ఞాను
ట్లుగాక మనస్సున కతీతమగు పరబ్రహ్మమున క్రీడింతురు

అదియుంగాక ముముక్షువు తనబ్రహ్మనిష్టను నియమముచే నాచరింపక
పోవుట యను ప్రమాదమువలన స్వరూపస్థితి నుండి జారుచున్నాడు ఎప్పుడు
స్వయంప్రకాశమాన స్వస్వరూపమును మందబుద్ధియై మరచునో అప్పుడు
దీపములేనప్పుడు చీకటి గ్రమ్ముకొనునటుల అజ్ఞానాంధకారము గ్రమ్ముకొ
నాత్మను ఆవరించుచున్నది. అప్పుడీముముక్షువు తన ప్రమాదముచే స్మృతి
తప్పిన వానివలె మోహితునివలెను పిచ్చివానివలెను దిఙ్మోహభ్రాంతునివలెను
యథార్థమును తెలియజాలడు. పరలోకమున దానిపుణ్యానుష్ఠానమును పుణ్య
నియమములను మరచియున్నాడు. తనదేహసౌఖ్యకరములగు వ్యవహారము

లందే ప్రవర్తించుచున్నాడు. అందుచేనాతడు విషయాదులయందు దగిలిన మనముగలవాడై అధోగతిపాలై సంసారమునబడి అనంతదుఃఖమును బొందు చున్నాడు. విషయసుఖములనే తియ్యటి పదార్థములని తలంచి అమృతమయ ముగా నవితోచుటచే వానినివిడనాడక భ్రాంతిగర్తమునబడి కొట్టుకొనుచున్నాడు తిరిగి నాదుర్భర సంసారగతితుండి తప్పించుకొనలేక మలినవాసనలు పెంపొం దుటచే పేడపురుగువలె మలినాజ్ఞాన కూపమున పడిపోవుచున్నాడు. ఎత్తైన ప్రదేశమునుండి పడినవాడు సకల అవయవములు తుత్తునియగుటచే తిరుగ బ్రతుక ఆశయేలేకున్న ఇకపడిపోయి లేచుటెట్లు? అలాగున తాను బ్రహ్మలక్ష్య మనెడు యున్నతశిఖరమునుండి పడిపోయెను. ఇకబ్రతుకజాలడు. ఇట్లుండగా తిరుగనాతడు ఆత్మప్రబోధ దశకురాగలునా? యెంతమాత్రము రాజాలడు. ఒక గొప్ప ఏనుగు ప్రమాదవశమున పెద్దబురదగుంటలో కాలిడెను వెంటనే దాని కాలు దిగబడెను ఆకాలిని బయటకు దీయుటకై మరియొకకాలిని దానిని బుర దలోప్రవేశపెట్టెను. ఆరెండవకాలున్ను తెలియకనే ఆమహాపంకములో క్రిందికి పోయెను. ఇటులనే మిగత పాదములయొక్క గతియునాయెను. క్రమముగా నాయేనుగు ఆందులోనేబడి మృతిజెందెను ఆతీరున అంతఃకరణమనెడు గజము అహంకారాది మదముచే ఉన్మత్తమై యత్కించి త్సుఖమునుగోరి సం సారపంకమున ప్రవేశించుచున్నది. అదిసంసారమనెడు బురదయందు మనస్స నెడు పాదము పెట్టుచున్నది. తిరుగనచ్చోట సుఖముగానక బుద్ధియనుపాద మును తదుద్ధరణకై ప్రవేశపెట్టుచున్నది. అటులనే మిగత చిత్తాహంకారము లను చరణములను అందుంచి క్రమముగా అంతఃహకరణ గజము మృత్యు రూప దుఃఖముననుభవించుచున్నది. అనగా కొంచెము సంసార విషయములో ప్రవేశించిన తెలియకనే నది జీవునిబంధింపజేయునని తెలియవలెను. జడభర తాదులు మహాతపస్సంపన్నులయ్యు. కొద్దిసంకల్పములుండినంతమాత్రమున స్వస్వరూపమునుండి జారిరి. తిరుగమృగజన్మము ధరించిరి. ఇదియు ప్రమాద ముయొక్క దుర్వి౽శీలమని తెలిపిరి. ఇట్లుండిన సంసారముననే అనేకులు న్నారు. వారందఱుగూడ స్వస్వరూపచ్యుతులై యున్నారు. వారికకి గతి లెదా యనినచో స్వస్వరూపమందుండుస్థితి యేంతయో పుణ్యముచే లభ్యమగునుగదా దానినుండి జారినను వానిగతి దుర్గతియేగదా' యని చెప్పితిరి నరేకాని "స్వల్ప మప్యస్య దర్మస్య త్రాయతే మహతొభయాత్" (అని భగవద్గీతా) కొంచెమై

నను స్వధర్మమున్న సంసారభయము తొలగునని చెప్పెనని ప్రశ్నలుదయించు
చున్నవి. నిజముగా స్వరూపాత్మ స్థితిగలవానికి భ్రంశమేలేదు స్వరూపభా
వనయందుండు వానివిషయమై గీతచెప్పినది. వారున్ను జాగ్రత్త లేకుండిన
అట్టిస్థితిని పొందకయుండిన పతితులగుదురు. తిరిగి జాగ్రత్త సంపాదించి
స్వరూపస్థితులై నవో యున్నతమగు బ్రహ్మలక్షమునుపొందగలరు కొందఱు
స్వరూపొన్నస్థితిని గురించి గొప్పగా చెప్పుకొనుచు అట్టిస్థితిపొందలేక సంసార
విషయ సుఖములందే కొట్టుకొనుచున్నారు ఇంతగా ఒత్తి చెప్పుటయేమనగా॰
కొంచముగూడా ముముక్షువైనవాడు ప్రకృతికి మలినవృత్తులకు అవకాశమొ
సగక స్వస్వరూపధ్యానపరుడై యుండవలయు. మఱియు అభ్యాసకాలమున
బ్రహ్మనిష్ఠాపరునకు స్వరూపమునుండి జారుట సంభవించును. ఒకేపర్యాయము
అనంతబ్రహ్మములోనికి ప్రవేశింపజాలడు తనకు స్వరూపస్థితి సంభవించున
ప్పుడు మనస్సును ఇతరవిషయములందు పోనీయక తిరుగ బ్రహ్మలక్ష్యమును
చేరుటకై ప్రయత్నముచేయవలెను. దీనికేయోగీశ్వరులు ప్రత్యాహారముననుష్ఠిం
తురు. విషయములయందు ప్రవర్తించు మనస్సును బలాత్కారముగా నిగ్రహిం
చుటయను ప్రత్యాహారముచే సమాధిలాభముగలుగును కనుక సర్వదా ప్రమా
దమునకు అవకాశమునివ్వకుండ జాగ్రత్తగా స్వరూపచింతన చేయుచుండవల
యును ఇదియే ముముక్షువునకు పరమధర్మము మఱియు వివేకవంతుడైన
బ్రహ్మవేత్త తనఆత్మకు అడ్డువచ్చు దానినంతయు తొలగించి తనఆత్మ జ్ఞాన
విషయములో నిరంతరము జాగరూకుడై యుండుచు అసత్తును వదలి సత్తును
గ్రహించుట జ్ఞానవంతుని స్వభావమైయున్నది. "ప్రక్షాళననాద్ధిపంకస్య
దూరాదస్పర్శన వరం" బుగడలొ్రక్కి కాలు కడుగుటకంటె ఆ పంకిలమును
స్పృశించక దూరముగనే యుండును అలాగున ప్రజ్ఞాశాలురగు ముముక్షువులు
ప్రమాదమును చెందకయే యుందురు అమృతమయమగు స్వస్వరూపస్థితిని
అభ్యసించు బ్రహ్మధ్యాన పరాయణునకు కాలకూట విషముతో సమానమై
ప్రమాదమున్నది కొంచెము విషముకలిపినను అమృతముపయోగపడక
మరణహేతువగు నటుల విషయదోషాది మిశ్రబ్రహ్మ చింతనము సంసార
హేతుకమగును ఈ ప్రమాదమనునది తమోగుణజన్యము మూలజ్ఞానమునుం
డియే ఇది కలుగుచున్నది. దీనికి స్వరూప ప్రజ్ఞయే దేదీప్యమానాంతర్భాస్క
రుడు దీనియందు విరక్తులగు ముముక్షువులు కడుజాగరూకులై యుందురు

అనేక సంవత్సరములనుండి ధ్యాననిష్ఠుడై బరగుచున్న ఆత్మయోగిసత్తముడు. ఒకసారి విషయ వాంఛలలో తగులుకొని అప్రమాదముచే వానితపస్సంతయు. క్షయించుచున్నది. పాయసమెంతయున్నను ఒకచుక్క విషము గలిపిన ఆ పరమాన్నముచే ప్రయోజనములేనటుల తపోనిధికి ప్రమాదము జనించిన ఆ తపస్సు నిర్వీర్యమగుచున్నది కావున బ్రహ్మవిదునకు దుష్టమైనప్రమాదము కంటె వేరేమృత్యువులేదు. పరమాత్మయందు బుద్ధి యుంచినవానికి స్వస్వరూప భావనాభ్యాసికి ఈ శరీరము పోయినను వ్యాధులచే పీడింపబడుచున్నను ఆ యత్మప్రజ్ఞ అనగా నేను బ్రహ్మమను జ్ఞప్తి నశించునదిగాదు. కావున శరీరము పోయినను మరణముకాదు ఆత్మవిస్మృతియే మృత్యువని పెద్దలునిరూపించిరి. ఇట్టి ప్రమాదమును దూరీకరించి సమాధియందు అనగా స్వస్వరూప ధ్యానమునందు నిశ్చలచిత్తుడైన బ్రహ్మజ్ఞాని పరబ్రహ్మ సాక్షాత్కార సిద్ధిని పొందుచున్నాడు కావున ముముక్షువు పరబ్రహ్మమందు లెస్సగా యుంచబడిన మనస్సుగలవాడై అజాగ్రతలేనివాడై అనాత్మభావన కవకాశమొసంగక ప్రకృతికి లోనగాక స్వస్వరూపస్థితియందు దృఢముగా యుండవలయును. ఇందుకు భగవద్గీత "వ్యవసాత్మికాబుద్ధి స్సమాధౌనవిధియతే అనగా సమాధియందు ఇతరవ్యాపారముగల బుద్ధి ఉపయోగపడదు. సమాధావచలాబుద్ధి స్తదాయోగ మవాప్స్యసి" అనగా సమాధియందు అచంచల బుద్ధియుండిన యోగసిద్ధిని పొందగలడు. అనిచెప్పుచున్నది ప్రమాణము

శ్లో॥ ప్రమాదంజహి, తత్త్వజ్ఞ తాత్వికీం స్థితిమాప్నుహి
ప్రమాదస్సర్వకాలుష్యం వితనోతి క్షణక్షణే ॥ అనగా

ప్రతిక్షణము ప్రమాదము (ఆత్మను మరచుట) సమస్తదోషములను కలిగించుచున్నది కావున ప్రమాదమునను ఓతత్త్వజ్ఞా! వదలి యుండుమా యదార్థమగు స్వరూపస్థితిని పొందియుండుమా॥

ఇకను అజ్ఞానముయొక్క మూలపరివారమైన యహంకార మమకార కర్తృత్వభోక్తృత్వ దుఃఖిత్వ సుఖిత్వాది సకలానర్థములకు బీజభూతములగు సంకల్పములను విడువవలయును. సంకల్పరాహిత్యమే మోక్షమని యందురు కేవలం భావపరంపరలను మాత్రము విలమొనర్చుకొనినచాలదు ఆనంద విస్ఫూర్తి విజృంభణానుభవముగూడ అవశ్యకమే. అందుచేముక్తియైన సకల బంధములనుండి విడివడుటయేకాదు తాను సదానంద పరబ్రహ్మ స్వరూపుడు

ంలయును. అదియే కై వల్యము. పరిపూర్ణ చంద్రుని యొక్క మేఘావర
ు. తొలగుట వలననే జీవులు సుఖించుటలేదు. ఆ చంద్రుని చంద్రికల
దనము చేతను. అమృతకిరణముల ప్రసారము చేతను. శ్రమను వదలి
కానందమును బొందుచున్నారు. అటులనే దేహము నేనను సంకల్ప గ్రంధి
ఏ అజ్ఞానావరణము తొలగి ఆత్మవికాసామృతదీధితులు ప్రసరించుటచేతనే
ారదుఃఖము తొలిగి శాశ్వత సుఖమును ముముక్షువులు బొందుచున్నారు.
ల్పములకు మూలము దేహము నేనను సంకల్పమే కారణము తంతువులు
మగునటుల సంకల్పములే అంతఃకరణమగుచున్నవి దేహము నేనను
ల్పరూప మనస్సు యొక మహాపర్వతమువంటిది. నదీ ప్రవాహ వేగముచే
కొనివచ్చుచున్న భూరేణువులన్నియు జేరి, క్రమముగా పర్వతాకారమగు
న్నవి లేక ఆ రేణువులు పరిణామవచనముచే కఠినతరశిలలుగాను నేర్పడి
భేద్యములగుచున్నవి ఆ తీరున జ్ఞానపరంపర నదీప్రవాహముచే సంకల్పా
ఫలన్నియు, సంఘీభూతములై దేహము తో గూడిన మనస్సనెడు మహా
క్వముగా మారుచున్నది. అందులోని యహంకార మమకారాదులే కఠినతర
ు దీని భేదమునకై వజ్రాయుధమువంటి మహాయంత్రములనెడు అనేక
ంతర యోగాదులచేసి మహాఋషులు మనఃపర్వతరాశిని కరగించి బ్రహ్మ
మలైనారు. ఓహో సంకల్పమహిమను దాని దుర్గతినై పుణ్యము చూడుడు.
క మొదటనే భూరేణువులు జేరకున్న శైలమేర్పడజాలదుగదా, అదేతీరున
భిమానముతో గూడిన సంకల్పములే లేకున్న మనస్సనునది మఱియొకటి
ండగలుగునా? మరియు సంకల్ప బీజములను జ్ఞానాగ్నియందు దగ్ధముచేసిన
సోఽహంకారముగా అనగా పరబ్రహ్మమే నేనను విశుద్ధమగు సత్యసంక
ముజేసిన దేహాభిమాన యుక్తమగు మనోంకురములను కలిగింపజాలవు.
క సర్వసంకల్పనాశం జేయుటకు పరమాత్మయే నేనను సంకల్పమే చేయ
యి మంచి సుందరమగు ముఖారవిందమునకు నచ్చుటచ్చుట మచ్చలేర్పడిన
ఖలావణ్యము యెంతయో చెడిపోవును. అలాగున నిస్సంకల్ప నిర్మల
త్మకార హృదయ కమలమున సంకల్ప కంటకములుత్పన్నమైన ఆత్మాకార
పల హృదయమును బాధించును, సంకల్పములనెడు మచ్చలు చెరచును.

కావున సంకల్పముల నిశ్శేషముగా రహితమొనర్చి ఆత్మయే తానను
కల్పముతోనుండవలయును. ఇట్టివానికే జీవన్ముక్తి లంభించును. మోక్షము

శరీరమున్నప్పుడే బడయవలయును. జీవించి యుండగనే తాను సర్వ
ముక్తస్వరూపముతో నుండుటయే జీవన్ముక్తి. ఇచ్చోటనున్న యాత్మ
పరలోకమునందున్నది. అదియెచ్చోటనున్నను పరిపూర్ణమై యొకరూపము
మన్నది ఆత్మ గమనాగమనములు లేనిది కనుక దేహములోనున్నను దేహమ
విడిపోయిన తరువాతను ఇచ్చోట ముక్తమైనఆత్మ అచ్చోటను విముక్తాత్మ
అప్పుడుకూడ అతడు కేవలస్వరూపుడే. ఈ విషయమునే శ్రుతిపఠిపాడు
చున్నది.

శ్లో॥ యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ।
మృత్యోః సమృత్యుమాప్నోతి యఇహనానేవ పశ్యతి॥

తా॥ ఈలోకముననున్న ఆత్మయే పరలోకమందు గలదు అచ్చోటనున్న
ఆత్మ ఇచ్చోటను గలదు ఇచ్చటనున్నస్థితియే పరలోకమునగూడ గలదు
ఇటుగాక పరమాత్మ విషయమున భేదభావమునుజూచి తాను అనాత్ముడన
వినశ్వరుడనని తలంచి భేదభావమును జెందువాడు మృత్యుదేవతా యొక్క
పాలబడుచున్నాడు మరియు,

శ్లో॥ ఇహచేద శకద్భోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః।
తతః సర్గేషు, లోకేషు శరీరత్వాయకల్పతే॥

తా॥ ఈ శరీరమునందే జీవించియుండగనే తన ఆత్మను తెలిసికొనకపోయి
యితర లోకములయందును అజ్ఞానియై బద్ధుడగుచున్నాడు మరల శరీరముల
ధరించుచున్నాడు. యికను తనకన్నను దృశ్యమగు జగత్తు మఱియొకటి
కలదనియు "జీవుడు వేరు, పరమాత్మ వేరు, అను భావముచే తానుజీవుడనని
సుఖ దుఃఖయని తలంచి సర్వత్ర ఘటపటాదులవలె భేదభావమును జూచు
వాడు అధిష్ఠానాత్మ జ్ఞానములేనివాడు తప్పక సంసార దుఃఖభయమునే పొంద
చున్నాడు. ఇటుల వేదశ్రుతులు చెప్పుచున్నవి. ద్వితీయాద్వై భయభవతి"
అనగా బ్రహ్మమునకు తానువేరని తలంచుటయే భయము. అదియే అజ్ఞానము
సంసారము ద్వైతము "భయం తస్యాపి భాషితం" భేదభావముగల వాని
యొక్క మాటకూడ భయమే. ఈ లాగున అనేక ప్రమాణములచే తత్త్వ
వేత్తలు భేదమును నిరాకరించి తాను అఖండ స్వరూపుడనని తలంచి అద్వైత
తమునే బోధించి సదా భయరహిత్యమునే తెలిపిరి, కావున దేహేంద్రియా
ద్యభిమాన సంకల్ప వర్జితుడై దేహపాతమునకు మునుపే స్వస్వరూప స్థితి

యందు నిలకడ కలవాడై, ఆత్మారాముడై, జీవన్ముక్తుడై, యుండవలయు విదేహ కైవల్యమునిదియే దేహమున్నను దేహగత దోషములనంటక దృశ్య రహితుడగుటచే సదానంద బ్రహ్మమైయుండుటయే విదేహకైవల్యము భయ రహితమార్గము ఆనందస్వరూపము. అఖండైకరస సహ్వానుభూతి పరిపూర్ణము శివము. శాస్త్రము. అద్వైతము.

ఈ జగమంతయు బ్రహ్మమయము "సర్వమాత్మమయం జగత్" తానే జగద్రూపుడై వెలయుచున్నాడు. ఈ ప్రకారము శ్రుతులు, స్మృతి పురాణాదులు జెప్పుచున్నవి. సర్వంఖల్విదం బ్రహ్మ, ఇది యంతయు బ్రహ్మ మయమే "పూర్ణ మదః పూర్ణ మిదం" అంతయు పరిపూర్ణమే. అవి మహా వాక్యములుగూడ సకలము బ్రహ్మమని తెలుపుచుండగా నజ్ఞానరూప ప్రమాద ము వలన నీసమస్త జగత్తును బ్రహ్మకన్న వేరుగాదని తలంపక తాను సకల జగదధిష్ఠాన భూతుడయ్యు, నామరూపభేదములచే ఘటత్వపటత్వాది. నానాత్వ ములు జెందిన జగత్తును భేదభావముతో గాంచువాడై నెవండు పండితుడైనను యెప్పుడైనను సరినొకవేళ నేమరియుండిగాని దేశకాలాది పరిచ్ఛిత్తిలేని నపా రమైన నాశములేని పూర్ణమైన పరబ్రహ్మమందు నీషద్భేదదృష్టిని నుంచు చున్నాడో పరబ్రహ్మముచేత నాత్మకము తానుగూడ చైతన్యమే, అయినను బ్రహ్మమందు బృహచ్చైతన్యమున్నది నాయందు చైతన్యాంశమున్నది. ఇట్టి భేదమునైనను స్వీకరించుచున్నాడో యీశ్వరుడు చైతన్యాత్మకుడే జీవు డనగు నేను చైతన్యాత్మకుండనే. అయితే నేనాసర్వేశ్వరునికి లోబడినవాడను నణుమాత్రభేదమునైన దలంచుచున్నాడో ఆ బ్రహ్మమువేరు నేను వేరయని భేదప్రతీతిని బొందుచున్నాడో అప్పుడే వెంబడే భిన్నభావము గలుగు సమ యముననే ద్వైతజన్య భయమునకు లోనగుచున్నాడు. ఇట్టివాని సర్వస్వరూ పము ననాత్మభావములే. నిబిడితములై సంసారమోహమాలిన్యానులిప్తమై నెగడు చున్నది. భేదభావమును బొందియున్నవాడు పశువని శ్రీ జగద్గురు ఆది శంకరాచార్యులు చెప్పిరి చూడుడు.

శ్లో॥ అథ్యోఽసావహ మన్యోఽస్మీత్యు పాస్తే యోఽన్య దేవతాం
నసవేదనరో బ్రహ్మ నచదేవోఽన్యథా పశుః ॥

అనగా ఏ మూఢజనుండు సర్వదా స్వయం ప్రకాశమాన సచ్చిదానందాత్మక నిష్కళంక నిర్వికార పరబ్రహ్మ స్వరూపమయ్యు తన నిరవధికానందరూప

విశృంఖలత్వ సర్వాత్మభావత్వమును తెలిసికొనజాలక దేహాత్మబుద్ధితో బాహ్య దృష్టినే బహూకరించుచు పెనుబాములగు యింద్రియాదుల దుస్సహ దుర్విషయ విషముగ్రక్కుచుండగా అల్పసుఖకాంక్షియై అమృతప్రాపము లొల్కుచున్నవని దలంచి మాయామోహితుండై నేను జీవుండను బ్రహ్మమెట్లగుదునని దీనత్వ భావము దలపోయుచు బ్రహ్మోపాసనను విడనాడి ఇతర దేవతోపాసనను జేయుచున్నాడో నాతడు బ్రహ్మను నెఱుంగజాలడు. అతడుదేవుండుగాడు మరేమనిని ద్విపాద పశువేయనబడును. పశువునకును నతనికిని సేవ్య వహారములలోగూడా నీషత్తైనను భేదములేదని చెప్పియున్నారు. కావున పరబ్రహ్మమునేనుపాసింపవలయును "తదేవబ్రహ్మత్వం విద్ధి. నేదంయదిదముపాసతే" అనగా నీవాబ్రహ్మమునే దెలిసికొనుము. నితరమగు దేవతనుపాసింపకుము. అన్యముపాసించువాడు బ్రహ్మముగాడు. అని ఉపనిషత్తు చెప్పుచున్నది. బ్రహ్మముకన్న వేరని తలంచువాడు పశువని శృతి వాక్యమున్నది. ముముక్షువులారా శ్రుతిభగవతి మాతృదేవియై హితమును దెలుపుచుండగా సంశయము పనియేలేదు. కడుంగడు ఆస్తిక్యబుద్ధితో తాము బ్రహ్మమే గావున "ఏ కమేవాద్వితీయం బ్రహ్మ, నేహ నానాస్తికించిన" ఈ బ్రహ్మమే ఏకమైయున్నది నానాత్వమునొకించుకయులేదు. ఇదియే సత్యము కాబట్టి ముముక్షువులారా బ్రహ్మస్వరూపులుగండు. ఇటులెరింగి తలంచనివారు భయమునే బొందుదురు. "ఏ తస్మిన్నుదరమంతరం కురుతే అధతస్యభయం భవతి" ద్వితీయాద్వైభయం భవతి" అనగా ఈ పరబ్రహ్మమందు కొంచెము బేదభావమునైనజూచిన ద్వైతమే భయము గనుక భయమునేబొందును. యని శృతియుగూడ పరబ్రహ్మమునే నుపాసింపవలయునని బేధభావముగూడదనియు దయతో తెలుపుచున్నది. పండితునిగూడ భేదమతి సంసారగర్తమున పడవేయునని నితరుల విషయమై ఇకజెప్పవలసిన పనిలేదని తెలియవలయు. గనుక ప్రమాదమును జెందక స్వస్వరూపధ్యానమును విడనాడక పరబ్రహ్మోపాసనచే ప్రజ్ఞారూపుడై సదాయుండవలయు.

ఇక ఈ ప్రపంచమంతయు బాహ్యదృశ్యము అహంకార మమకారాదులు అంతఃకరణములో అనాదిగాయుంటున్న సంస్కారములు వృత్తులు ఇవియన్నియు అంతరదృశ్యము దృశ్యమనగా దృక్కగు ఆత్మకు యేదేది గోచరమగుచున్నదో అది యంతయు దృశ్యము. ఆత్మకన్న వేరైనది అనగా

అనాత్మపదార్థములు దృశ్యము, ఆత్మపదార్థము దృక్కు దర్శనము దీనినంతయుగాంచుట ఇదియే త్రిపుటి, దీనిని రహితమొనర్చి తాను సర్వదా అధిష్ఠాన బ్రహ్మమయి ఉండవలయును. ఆత్మయందు అనాత్మత్వబుద్ధి దేహేంద్రియాదులందు ఆత్మత్వబుద్ధి ఇట్టివి. పర్యాసముచే కల్పింపబడిన ప్రపంచమున్ను తత్తద్వ్యవహారములున్ను దృశ్యమే "యదృశ్యం తన్నశ్యం" అనగా యేది దృశ్యమో అదినశించునదియే. యీలాటి కల్పితదృశ్యము వేదములచేతను మన్వాదిస్మృతులచేతను ఘటపటాది న్యాయములచేతను ఘటము మృత్తికన్న వేరుగాదు. ఘటము కల్పితము. మృత్తికయే సత్యము. అలాగున పటము సత్యముగాదు, నూలు సత్యముకాబట్టి పరమాత్మయే సద్వస్తువు జగత్తుమిథ్య పూర్తిగా నిషేధింపబడినది. అదెటులవగా "నేహనానాస్తి కించన" ఇచ్చట నానాత్వము భేదబుద్ధి కొంచముగూడలేదు వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవసత్యం॥ ఇవి మొదలగు వేదప్రమాణములు "అయం ప్రపంచోమిథ్యైవ సతతం బ్రహ్మైకమద్వయం" ॥తా॥ ఈ ప్రపంచము మిథ్య సతతము అద్వయ బ్రహ్మమేయున్నది. ఇత్యాదిస్మృతి ప్రమాణములు. "అయం ప్రపంచోమిథ్యైవ జీవోబ్రహ్మైవనా పరః" అనగా ఈ ప్రపంచము మిథ్యాభూతము. జీవుడు బ్రహ్మమే వేరుగాడు కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః కార్యకారణ తాంహిత్వ పూర్ణబోధోవశిష్యతే" శ్రీ సద్గురు శంకరాచార్యులవారి వాక్యమురీతిగా ఇకను వేదాంత శాస్త్రమునందలి రజ్జు సర్ప శుక్తి రజతాది న్యాయములు ఘటపటాది యుక్తులు గగననీలిమాది దృష్టాంతము మహర్షుల స్వానుభూతి వాక్యములు మహావాక్యములు

పైన నిరూపించబడిన దృశ్యమునంతయు నిశ్శేషముగా సుతరాం నిషేధించుచున్నవి. వేదశ్రుతి భగవన్మాత యుద్ఘోషించుచుండ మహాత్ములు సహప్రముఖములుగా అనేక శాస్త్రప్రమాణముల చేతను బహువిధ యుక్తులచేతను దృష్టాంతములచేతను హితమును బోధించుచుండ దీనినంతయు వినియు కొంచెముగూడ లక్ష్యము జేయక మాయాశక్తిచే భ్రమపడి మోహితుడై పైనిరూపింపబడిన యనేక ప్రమాణములచే నిషిద్ధమైన దృశ్యమును సత్యమని నమ్మి అసత్యమగు దేహాదులయందు ఆత్మత్వబుద్ధిని జేయువాడు కర్తృత్వ భోక్తృత్వాద్యభిమాన పరంపరలకు గురియగువాడు జనన మరణాద్యనేకానర్థములననుభవించుచున్నాడు. ఆత్మహితమును స్వీకరింపనివానికి దుర్గతి తప్పదుసుమా.

